# గాయత్రీ విశ్వకర్మలు

mohan
PUBLICATIONS
ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక
విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్
FB@mohanpublications

మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.



Like us to follow
@mohanpublications

# గాయత్రీ విశ్వకర్మలు

శ్లో॥ గాయత్రీ విశ్వకర్మాణా వచిన్త్య మహిమాన్వితౌ
విశ్వశిల్ప ప్రణేతారౌ పితరౌ జగతః స్తుమః.

గాయత్రీ విశ్వకర్మలు అఖిలబ్రహ్మాండ సృష్టికి హేతుభూతులైన పరమతత్త్వస్వరూపులు. సృష్టికి పూర్వము "ఏకం సత్" అనునట్లు ఏక రూపముగానున్న జగత్కారణతత్త్వమును వేదఋషులు "నాసదాసీ న్నో సదాసీత్" అనికూడ గానము చేసినారు. అది ద్వంద్వభేదములు లేని పరమాతీత తత్త్వము-సదసదతీతము; తమో జ్యోతిర్విముక్తము. అందుకే తత్త్వజ్ఞులు దానిని —

"తమో జ్యోతి ర్విముక్తం యత్ ద్వైతాద్వైత వివర్జితం
సదసత్పర మవ్యక్తం ప్రాహ్యతా మతిమానసమ్."

— యోగదర్శనము.

అని గానము చేసినారు. ముముక్షువులకు జిజ్ఞాసువులకు తెలిసికొనదగిన పరమజ్ఞేయ మదియే! అందుకే గీత —

"జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వాఽమృత మశ్నుతే
అనాదిమ త్పరం బ్రహ్మ న సత్తన్నా స దుచ్యతే."

అధ్యాయం 13, శ్లో 12.

సర్వజ్ఞేయమగు నా తత్త్వము సదసదాది ద్వంద్వరహిత మని వేదవాణిని అనుసరించినది. దాని నెఱింగిననేకాని జీవులు అమృతులు కారట!

ఈ విధమైన ఆదిమ తత్త్వమున ద్వంద్వస్వరూపమగు సృష్టి జరుగుటకై తదభిన్నమగు నింకొక తత్త్వము యొక్క ప్రాదుర్భావము జరిగినది. అనగా ఆదిమ పరతత్త్వమున అద్దాని ప్రతిబింబమే అని చెప్ప దగిన మఱియొక తత్త్వము ప్రకాశించినదన్నమాట. జగదుత్పత్తి జరుగుటకు ద్వితీయ తత్త్వ మావశ్యకము గదా ! ఈ ప్రథమ ద్వితీయ తత్త్వము లనుగూర్చి బృహదారణ్యకోపనిషత్తు ప్రథమాధ్యాయములోని చతుర్థ బ్రాహ్మణము ఇట్లనుచున్నది. —

"ఆత్మైవేద మగ్ర ఆసీ త్పురుషవిధః . సోఽను వీక్ష్య నాన్య దాత్మనోఽపశ్యత్ . . సవై నైవ రేమే.
తస్మా దేకాకీ న రమతే. స ద్వితీయ మైచ్ఛత్."1. 2

జగదుత్పత్తికి పూర్వ మాత్మవస్తు వొక్కటే యుండెను. అది తనకంటె నితర మేదియు లేకుండుట గమనించెను. ఆ ఏకైక వస్తువు క్రీడింపలేక పోయినది. ఔను రెండవది లేనిదే క్రీడ యెట్లు సాగును? కావున ఆ ఆత్మ, రెండవది కావలెనని తలచినది. ఈ రెండవ వస్తువే గాయత్రీస్వరూపిణియగు ప్రకృతి. ఆ మొదటి తత్త్వమగు ఆత్మయే పురుషుడు. ఈ ప్రకృతి పురుషులను గూర్చి భగవద్గీత యిట్లనుచున్నది. —

"ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభా వపి
వికారం శ్చ గుణాం శ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్." -13.19

ప్రకృతిపురుషు లిరువురును అనాదిసిద్ధులు. నానా వికారములు, గుణములు ఆ ప్రకృతినుండి కలిగినట్టివి. అనగా ముందు చెప్పిన రెండు జగత్కారణ తత్త్వములకు ప్రకృతి పురుషులని పేరన్నమాట. ఈ ప్రకృతి పురుషులను మాయా మహేశ్వరులనుగా శ్వేతాశ్వతరోపనిషత్తు వర్ణించినది-

మాయాం తు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరం,
తస్యావయవభూ తైె స్తు వ్యాప్తం సర్వ మిదం జగత్."
— 4-10

ప్రకృతికి మాయయనియు, అట్టిమాయను వశీకరించుకొని జగత్క్రీడ జరుపు పురుషునికి మహేశ్వరుడనియు, పేరులు. చరాచరాత్మక జగత్తంతయు ఆ ఉభయతత్త్వముల అవయవములతో నిండియున్నట్టిదే - అని శ్లోకాభిప్రాయము. అనగా జగత్తులోని ప్రతిదియు ప్రకృత్యంశమును, పరమపురుషాంశమును పొందియే సంసారక్రీడ నడుపుచున్నదని భావము. బ్రహ్మాండమునందలి చరాచరాత్మకమగు ప్రతిదియు అవ్యక్త మహదహంకారాద్యష్ట ప్రకృతులనుండియు, పరమపురుషుని నుండియు కలిగి తదుభయస్వరూపముగానే తేజరిల్లుచున్నదని సారాంశము. ఈ అంశమునే శ్వేతాశ్వతరములోని దిగువ మంత్రముగూడ స్పష్టము చేయుచున్నది —

" అజా మేకాం లోహిత శుక్ల కృష్ణాం
బహ్వీః ప్రజాః సృజమానాం సరూపాః
అజో హ్యేకో జుషమాణోఽను శేతే
జహాత్యేనాం భుక్తభోగా మజోఽన్యః"

—4 వ, అధ్యాయం 5 వ శ్లోకం.

ఇందలి లోహిత శుక్ల కృష్ణ శబ్దములచేత ప్రకృతిలోని రజోగుణము, సత్వగుణము, తమోగుణము చెప్పబడుచున్నవి. అనగా త్రిగుణాత్మక ప్రకృతినుండియే పాంచభౌతికమగు జగమేర్పడుచున్నదనిభావము. ఈ త్రిగుణమయజగమును- అనగా శరీరమును అధిష్ఠించి ఆత్మ్మడు సుఖదుఃఖములను అనుభవించు చున్నాడు. ప్రకృత్యతీతుడగు మఱియొకడు (ఈశ్వరుడు లేదా ముక్తపురుషుడు) ప్రకృతికి వశుడుకాక, (అటంక) దాని నాడించుచున్నాడని భావము. వస్తుతః ఈ మంత్రమున- జగదుపాదానకారణమగు ప్రకృతి, జీవులు, ఈశ్వరుడు - అనెడితత్త్వత్రయము చెప్పబడినట్లు. "మాయాం తు ప్రకృతిం విద్యాత్" అను మంత్రమున మాయామహేశ్వరులుగా పేర్కొనబడిన తత్త్వములే ప్రకృతి పురుషులని పాఠకులకు చెప్ప బనిలేదు. అనేక నామములతో తత్త్వమును పేర్కొని సాధకుల కాత్మవిజ్ఞానమును కలిగించుట శ్రుతి మాత కిష్టము. ఈ ప్రకృతిపురుష సంయోగము లేనిది జగమున స్థావర జంగమ రూపమగు నే వస్తువును సృష్టింపబడదనుటకు గీతలోని దిగువ శ్లోకముకూడ ప్రమాణమే —

"యావ త్సంజాయతే కించి త్సత్త్వం స్థావర జంగమం
క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగాత్త ద్విద్ధి భరతర్షభ!"
—అ. 13 శ్లో. 26

ఈ లోకమున స్థావరముకాని, జంగమముకాని అయిన ఏవస్తువు సృష్టింపబడవలయు నన్నను, అందుకు క్షేత్ర, క్షేత్ర జ్ఞులయొక్క సంయోగమే కారణము. ఈ క్షేత్ర క్షేత్రజ్ఞులనే మనము (గీతకూడ) బ్రహ్మాండసృష్టి సందర్భమున ప్రకృతి పురుషులని పేర్కొన్నాము.

సృష్టిహేతువు అయిన ఈ ప్రకృతి, పురుష(ఆత్మ, లేక బ్రహ్మము - ఇత్యాదులు) జగత్తులోని స్త్రీ పురుషులకు సంకేతములు. స్త్రీ పురుష సంయోగము లేనిదీ సృష్టి జరుగ నట్లె, ప్రకృతి పురుష సంయోగము లేనిదీ బ్రహ్మాండసృష్టియు జరుగదన్నమాట. ప్రకృతి జడమనియు, పురుషుడు చైతన్య రూపుడనియు మనము సాధారణముగా తలంచుచుందుము కాని యథార్థదృష్టిలో జడమనునది లేనే లేదు. జడమనగా అనభివ్యక్త చైతన్య మన్నమాట. అది స్వాంతర్గర్భిత చైతన్యమును ఎప్పుడో ఒకప్పుడు వ్యక్తీకరించి తీరును. సృష్టిక్రియ జరుగువేళ మనము జడమనుకొను ప్రకృతియందు పురుషచైతన్యము ఆవేశించినగాని, అది సృష్టి సమర్థము కాదు. అట్లే కేవల పురుషుని (ఆత్మ) వల్లను సృష్టి జరుగదు. ఈ ఉభయ తత్త్వముల అన్యోన్య సామరస్యమే సృష్టి! అందుకే మిత్రసాహస్రిలో—

"ప్రకృతి పురుషుఁ బొందె పరిపూర్ణత గడించు,
పురుషు డట్లె ప్రకృతిఁ బొంది మరియు,
ఉభయ సామరస్య ముత్తమ సృష్టి యౌ
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర!"
"శివుడు శక్తి లేక సృష్టింపజాలడు,
శక్తి శివుడు లేక రక్తి గనదు,
శక్తిశివుల మధుర సామరస్యమె సృష్టి!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర!"

అని వ్రాయుట యైనది. శంకరులు సౌందర్యలహరిలో
"శివ శ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుమ్"
శివశక్తుల కలయిక సృష్టిహేతువని గానము చేసినారు కదా!

ఏకమేవాద్వితీయ మగు పరమాత్మయందు జగత్సృష్ట్యర్థమై తోఁచిన ప్రకృతి - ఆకాశ, వాయ్వగ్ని, జల, భూస్వరూపములతో పంచవిధమైనది. ఈ పంచభూతములే సృష్టికి హేతుభూతములు. కావుననే సృష్టిని పాంచ భౌతిక మనియు, ప్రపంచమనియు, అన్నారు. ఇచ్చట అఖండ పర బ్రహ్మమునకు అఖండప్రకృతితోడి సంగము (పొత్తు) అనివార్య మను నంశమును సాధకులు మఱువరాదు. ఈ పంచభూతాత్మక ప్రకృతి పంచ శక్త్యాత్మిక కూడను. 1 ఆదిశక్తి, 2. పరాశక్తి, 3. ఇచ్ఛాశక్తి, 4. క్రియాశక్తి, 5. జ్ఞానశక్తి, -అనునవే ఆ పంచశక్తులు. ఇవి పరస్పరోప కారకములు, అన్యోన్య జనకములు కూడను, ఈ పంచశక్తుల కధినాథులుగా మను,

మయ త్వష్ట్ర, దైవజ్ఞ (శిల్పి) విశ్వజ్ఞు లనెడి పంచబ్రహ్మలు ప్రకాశించినారు. వీరిని - సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాను లనియు. ఆ పేరులతో నొప్పు విశ్వకర్మ ముఖములనియు కూడ భావించినారు. ఈ శక్తులు, బ్రహ్మలు, కారణములుగా - సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహము లనెడి పంచకర్మలు విస్తరించినవి. ఈ పంచక్రియల చేతనే బ్రహ్మాండము నడచుచున్నది. ఈ బ్రహ్మలను మూర్తులుగా భావించినపుడు - బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఇంద్ర, సూర్యులు ప్రకాశింతురు. వారి శక్తులే - వాణీ, లక్ష్మి, పార్వతీ, శచీ, సంజ్ఞ లనెడి దేవతలు. ఈ పేర్కొన్న జంట లన్నింటను స్త్రీ పుంసయోగము - లేదా దంపతిత్వము, ప్రకృతి పురుష తత్త్వము పరిపూర్ణము. మన సంస్కృత వాఙ్మయములో కొన్ని యెడల త్రిమూర్తులను కొన్ని యెడల పంచమూర్తు లను స్వీకరించినారు. పంచమూర్తి గ్రహణము సృష్టి తత్త్వా నుగుణము.

సృష్టిలోని ఈ పంచసంఖ్యా ప్రాధాన్యమును ప్రతిపాదకు డును గమనించితీరవలయును. అట్టి గమనిక కొఱవడునేమో అనియే మనుష్యుల కరచరణములకు అయిదేసి వ్రేళ్ళనే భగవంతుడు సృష్టించి సృష్టి రహస్యమును హస్తామలకము ( అఱచేతియుసిరిక - సులభము ) చేసి చూపినాడు. అట్లే పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, అన్నమ యాది పంచకోశములు, పంచప్రాణములు - మొదలగునవియు

సృష్టిలోని పంచసంఖ్యాప్రాధాన్యమునకు సూచకములే. సృష్టిలోని పంచసంఖ్యాప్రాధాన్యము నిల్లు వ్యంగ్యముగా తెలియజేయుట సృష్టికర్త యుద్దేశ్యమన్నమాట!

ఈ విధములైన బహుళపంచకముల ప్రాశస్త్యముతోనే గాయత్రీ విశ్వకర్మల తత్త్వము తేజరిల్లుచున్నది. స్త్రీ పుంస యోగము, లేదా - ప్రకృతి పురుష సంయోగము సృష్టికి మూలము కావున ఈ ఉభయలింగములు సాధకులకు సదా సమారాధ్యములు. ఈ ప్రకృతి పురుష స్వరూపులగు గాయత్రీ విశ్వకర్మలు జగత్తునకు మాతాపితృభూతులే ! పంచశక్త్యాత్మకురాలు గాయత్రీమాత. పంచబ్రహ్మాత్మకుడు. పంచమూర్త్యాత్మకుడు, విరాడిశ్వకర్మ, ఉభయులును పంచక్రియాకారకులే. ఈ ఉభయులకు ఉపాసకుల కార్యార్థము స్త్రీపుంభేదమూ, మాతాపితృత్వమూ సిద్ధమయినదే కాని, వస్తుతః ఇరువురును పరమాద్వైతస్వరూపులే. ఉభయులును ఉపాసించుటవలన సాధకు లందునది పరమాద్వైతభావమే.

విశ్వకర్మనామము గాయత్రికికూడా చెల్లును. ఆమె కూడ విశ్వ (సమస్త) కర్మలకు అధీశ్వరియే. ఉభయులకూ నామరూపక్రియా కలాపములందు సాదృశ్యమున్నది. పంచశీర్షత్వ, దశబాహుత్వాదులు ఉభయులకును తుల్యములే ! ఇంతవరకును సంగ్రహముగా తెలిసికొన్న ఈ జగత్పితరుల తత్త్వమునుగూర్చి వేదోపనిషదాదుల సమ్మతిని పరిశీలించి చూతము.

# వేదప్రమాణము

గాయత్రీమాత విశ్వకర్మ నామముతో పిలువబడిన ఘట్టమొకటి యజుర్వేదమునం దగపడుచున్నది—

"దేవాసురా స్సంయత్తా ఆసన్. తేషాం గాయత్ర్యోజో, బల, మింద్రియం, వీర్యం, ప్రజాం, పశూన్, త్సంగృహ్యాదాయాపక్రమ్యాతిష్ఠత్తేఽమన్య న్త యతరాన్వా ఇయ ముపావర్త్స్యతి తఇదం భవిష్య న్తీతితాం వ్యహ్వాయ న్త విశ్వకర్మ న్నితి దేవా, దాభీత్యసురాః. సా నాన్యతరాంశ్చ నోపావర్తత. తే దేవా ఏతద్యజు రపశ్య న్నోజోఽసి, సహోఽసి, బలమసి, భ్రాజోఽసి, దేవానాం ధామ నామాసి. విశ్వమసి, విశ్వాయుః సర్వ మసి, సర్వాయు రభిభూ రితి వా అసురాణా మోజో, బల, మింద్రియం, వీర్యం, ప్రజాం, పశూనవృంజత—"

— యజుః కాండం 2. ప్ర. 4. అను. 3

గాయత్రీష్టి, లేదా - సంవర్గేష్టి సందర్భములోనివి ఈ మంత్రములు. సోదరులకు కలహము వచ్చినపు డీ యజ్ఞమును చేసి విజయసిద్ధి నందుదురు.

దేవాసురులొకసారి యుద్ధసన్నద్ధులైరి, గాయత్రీదేవి దేవాసురుల ఓజస్సు, బలము, ఇంద్రియశక్తి ఉత్సాహము, సంతు, పశుసంపద - అను నాటింటిని హరించివైచెను. ఆ సందర్భమున దేవాసుకు లిరువురు గాయత్రిని సంస్తుతించుచు

- దేవతలు ఆమెను "విశ్వకర్మ" యను పదముతోను, అసురులు "దాభి" అనుపదముతోను సంబోధించిరి. దేవత లింకను ఓజః ప్రభృతి దివ్యశక్తు లాతల్లియొక్క స్వరూపములే యని తలచి ఆమె నట్లే సంస్తుతించి, ఆమె హాించిన తమ ఓజోబలాదులను మరల పొంది అసురులను నిర్వీర్యులను చేసి వారిని జయించినారు. దీనిని బట్టి గాయత్రి ఓజోబలాది శక్తి దాత్రి యనియు తెలియుచున్నది. అందుకే సంధ్యావంద నములో "ఓజోఽసి, సహోసి, ఽబలమసి, భ్రాజోఽసి...." ఇత్యాదిగా మన మా తల్లిని ప్రార్థించుచున్నాము.

ఈ మంత్రమునందలి విశ్వకర్మ, దాభీ పదములకు సాయణు లిట్లు భాష్యమును వ్రాసియున్నారు.

"హే విశ్వకర్మ న్నితి దేవానా మాహ్వానం, దాభీ త్యసురాణా మాహ్వానం. విశ్వాని కర్మాణి యస్యాః సా విశ్వకర్మా' తత్సంబోధనం హే విశ్వకర్మ న్నితి. దభ్నోతి- విరోధినో హినస్తీతి దాభీ, తత్సంబోధనం హే దాభీతి."

సాయణులు విశ్వకర్మ సూక్తములోని విశ్వకర్మ శబ్దమునకు భాష్యమువ్రాయుచు - "విశ్వవిషయాణి సృష్టి స్థితి సంహార రూపాణి యస్యాసా విశ్వకర్మా" అని వ్రాసినారు. ఇంతేకాదు. సాయణులు వేదములో నెచ్చట విశ్వకర్మశబ్దము వచ్చినను ఆ దేవుడు సమస్త కర్మాధినాథుడనియే వాని పరాత్పరత్వము వ్యక్తమగునట్లు వ్రాయుచుందురు.

యజుర్వేదీయమగు నీ మంత్రము గాయత్రిని విశ్వకర్మ యని సంబోధించి గాయత్రీ విశ్వకర్మలకు గల పరమైక్యస్థితిని, జగత్పితృత్వమును మహాగంభీరముగా వ్యంగ్యరీతిలో వక్కాణించినది. వేద మెప్పుడును ఇట్టి రహస్యములను వ్యంగ్య మార్గముననే బోధించుచుండునని వేదవేత్తలకు చెప్ప పనిలేదు గాయత్రీ విశ్వకర్మల కిట్లు స్త్రీపుం భేదముతప్ప మఱే ఇతర భేదము లేదని విజ్ఞు లెఱుంగవలసి యున్నది. ప్రకృతి స్వరూపిణియగు గాయత్రియు, పురుషపదవాచ్యుడగు విశ్వకర్మయు విశ్వసృష్ట్యాది సమస్త కర్మల నొనర్చుచునే యున్నారని దీనిని బట్టి విశద మగుచున్నదికదా!

## ఉపనిషత్ప్రమాణము

త్రిసంధ్యలయందును ఉపాసింపబడెడు గాయత్రీ దేవికి సావిత్రి యనియు, సరస్వతి యనియు కూడ పేరులున్నవి. ఆమె మధ్యాహ్న వేళ సావిత్రిగాను, సాయం సమయమున సరస్వతిగాను ఉపాసింపబడునని ద్విజు లెఱుంగని విషయము కాదు. యజుర్వేదీయ విశ్వకర్మసూక్తములో విశ్వకర్మకు విశేషణము (పర్యాయపదము) గా "వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే" అని వాచస్పతి శబ్దము ప్రయోగింపబడియున్నది. వాచః=వాక్కునకు, పతిః = అధినాథుడైనవాడని భావము. ఇక్కడ వాక్కు లనగా తొలిపలుకులు మొదలుకొని సర్వవాఙ్మయమనని భావము. గాయత్రి వేదమాత యని సర్వ

తెలుంగుమరు. "నమామి వేదమాతరమ్" ఇత్యాది వాక్యములవల్లను అది విశదమగుచున్నది, కనుక గాయత్రి వాగ్రూపిణికూడ నన్నమాట! సాయణులు వాచస్పతి శబ్దమునకు భాష్యము వ్రాయుచు - "వాచస్పతిం = మంత్రరూపాయా వాచః పాలకమ్" అనినారు. - గాయత్రి వాగ్రూపిణి యనుటకు ఛాందోగ్యములోని దిగువమంత్రము ప్రమాణము--

> "గాయత్రీ వా ఇదగ్ంం సర్వం భూతం య దిదం కిం చ.
> వాగ్వై గాయత్రీ - వాగ్వా ఇదగ్ం సర్వం భూతం
> గాయతి చ త్రాయతే చ ."

3 వ అధ్యాయం. 12 వ ఖండం.

"చరాచరాత్మకమగు జగమంతయు గాయత్రియే. ఆ గాయత్రి వాగ్రూపిణియై అన్నింటిని పేర్కొనుచున్నది. రక్షించుచున్నది." గాయత్రి ఛందోరూపముగానే కాక, వాగ్రూపముగాకూడ నుండి గాన త్రాణము (పేర్కొనుట, రక్షించుట) లనెడి క్రియల నొనర్చుచున్నదని శంకరులు భాష్యములో స్పష్టమొనర్చినారు. దీనినిబట్టి పరా, పశ్యన్తీ, మధ్యమా, వైఖరీ స్వరూపములతో నున్నవాక్కు గాయత్రీ స్వరూపమేయని మంత్ర భావమైనట్లు స్పష్టము. అంతియే కాదు-

"బ్రాహ్మీ తు భారతీ భాషా గీర్వాగ్వాణీ సరస్వతీ". అనెడి అమర కోశవాక్యమునుబట్టి, వాక్కు అనగా సరస్వతియే

వాచస్పతి యనగా గాయత్రీస్వరూపిణియగు సరస్వతికి భర్త యనియే భావము. ఆ వాచస్పతి విశ్వకర్మయే దీనినిబట్టియు గాయత్రీ విశ్వకర్మల ఆదిమ దంపతిత్వము విశదమగుచున్నది.

## చతుష్పాద్విభూతి

జగత్ప్రసిద్ధమగు పురుషసూక్తమందు ప్రస్తుతింపబడిన దేవుడీ విశ్వకర్మయే యనుట సర్వు లెఱుంగినవిషయమే. పురుషసూక్త ప్రారంభమునుండి పలుసారులు పురుషుడుగా పేర్కొనబడిన జగత్కారణ తత్త్వము అంతమున—

"విశ్వకర్మణ స్సమవర్తతాధి
తస్య త్వష్టా విదధ ద్రూప మేతి."

అని విశ్వకర్మయనెడి విశేషనామముచే పేర్కొనబడినది. విశ్వకర్మ స్వరూపుడగు నీ పురుషుడు చతుష్పాద్విభూతి శాలి. అనగా నాలుగు పాదములు కలవాడని భావము. (ఈ నాలుగుపాదములు మాండూక్యోపనిషత్తులో ఓంకారమునకు చెప్పబడిన పాదములనియు భావింపవచ్చును.) నాలుగు పాదములలో ఒక పాదమే సమస్తబ్రహ్మాండములు. ఈ పాదాత్మక బ్రహ్మాండమా విశ్వకర్మ యొక్క వాస్తవ స్వరూపము కాదు. ఇంతకంటెను ఘనిష్ఠమైన దాయనస్వరూపము. త్రిపాదాత్మకమగు ఆ స్వరూపము శాశ్వతమును, నిత్య నిర్వికారచిన్మాత్రము నైనట్టిది. యథార్థమున అఖండపరమాత్మ స్వరూపమును పాదములుగా విభజించుట అజ్ఞానమే.

అయినను బ్రహ్మస్వరూపమును దృష్టియందుంచుకొని చూచి నపుడు జగ మతిస్వల్పమని సూచించుటయే శ్రుతికి తాత్ప ర్యము. పురుషుడు చతుష్పాదాత్మకు డనునంశమును పురుష సూక్తములోని—

"పాదోఽస్య విశ్వా భూతాని. త్రిపా దస్యామృతం దివి."

అనువాక్యములు స్పష్టముచేయుచున్నవి. "జగము నా లోని ఒకపాదమే" అనునంశమును గీతలలో భగవానుడు "విష్టభ్యాహ మిదం సర్వ మేకాంశేన స్థితో జగత్" అను మాటచే సూచించినాడు. అట్లే తత్ప్రతిబింబమేయగు గాయత్రీ దేవియు చతుష్పాదములతో నొప్పునట్టిదని ఛాందోగ్యోప నిషత్తు పలుకుచున్నది —

సైషా చతుష్పదా షడ్విధా గాయత్రీ. త దేత
దృచాభ్యుక్తం. తావా నస్య మహిమా.
తతో జ్యాయాగ్ంశ్చ పూరుషః.
పాదోఽస్య విశ్వా భూతాని. త్రిపాదస్యామృతం దివీతి."

— 3 వఅధ్యాయం 12 వ ఖండం.

గాయత్రిని బ్రహ్మసమ్మితమగు దేవతనుగా దర్శించి నప్పుడు విశ్వభువనము లన్నియు ఒక పాదముగను, తక్కిన దంతయు మూడు పాదములుగను తోచును. అట్లుగాక ఛందో రూపముగా భావించినప్పుడు గాయత్రీమంత్ర మిరువదినాలు

గక్షరములు కలది కావున ఆఱేసిఅక్షరము లొక పాదముగా నెన్నుకొన్నచో చతుష్పాత్త్వము సిద్ధము కాగలదని శంకరులు తన భాష్యములో విశదీకరించినారు.

బ్రహ్మసూత్ర శ్రీభాష్యమునందు జ్యోతిరధికరణములో రామానుజులు ఈ విధముగా వ్రాసినారు —"ఇచట గాయత్రి యనునది సర్వాత్మకముగా చెప్పబడుచున్నది. ఇట్లు సర్వాత్మకముగా నుండుట ఛందోమాత్రమగు గాయత్రికి అసంభవముగాన ఫలమునకై పరబ్రహ్మము గాయత్రీ సదృశునిగా ధ్యానింపవలయునని ఈ పై శ్రుతి విధించుచున్నది. "పాదోఽస్య సర్వా భూతాని" ఇత్యాది వాక్యములచే పరబ్రహ్మము నాలుగుపాదములతో గూడుకొనునదిగాను చెప్పబడుచున్నది. గాయత్రీ ఛందస్సునకు నాలుగు పాదములును గలవు. కాబట్టి ఈ విషయమున పరబ్రహ్మమునకు గాయత్రీ ఛందస్సుతో సామ్యము సంభవమే. ఏల యనిన, వేదముల యందు కొన్ని తావుల గాయత్రీఛందస్సునకు నాలుగుపాదములు గాన బడుచున్నవి—

"ఇంద్రశ్శచీపతిః, వలేనపీడితః,
దుశ్చ్యవనోవృషా, సమిత్సుసాసహిః"

ఛందోగులు-1 భూత, 2 పృథివి 3 శరీర 4 హృదయములనునిర్దేశించి "సైషా చతుష్పదా" అను వాక్యమున ఆ నాల్గింటిని గాయత్రీకిపాదములనుగా పఠించియున్నారు. అట్లు భూతాదులను పాదములనుగా కలిగియుండునది కేవల

చ్ఛందస్సుగాదు. కాబట్టి ఈ తాపునగాయత్రీశబ్దము పరమాత్మ పరమని చెప్పుట యుక్తము."

—ఆంధ్రీకృత శ్రీ భాష్యము.

శంకరులు బ్రహ్మసూత్ర భాష్యములో ఈ అధికరణ మును "జ్యోతిశ్చరణాధికరణ" మన్నారు. తన భాష్యము లో శంకరులుకూడ గాయత్రిచతుష్పాదయుక్తబ్రహ్మముతో తుల్య మే-బ్రహ్మమే అని నిర్వచించినారు. విస్తరముగ నెఱుంగదల చినవారు ఆ యాభాష్యములను తిలకించి తత్త్వమునుగ్రహింప వచ్చును. సారాంశము; నాలుగుపాదములు కలిగియుండుట యనెడిధర్మము గాయత్రీ విశ్వకర్మలకు తుల్యమే యని.

## ఆగమ ప్రమాణము

వైఖానసాగమము 20 వ పటలమున తృతీయావరణ ములో గంగాది దేవతల స్థానమును చెప్పుచు త్వష్ట్ర దేవుని గూర్చి ఇట్లు చెప్పినది—

"త్వష్టా - ప్లోతవస్త్రోత్తరీయాది సంచయః స్థానే హేమా భ శ్శుకపింఛాంబరధర శ్చతుర్భుజః కలశాక్షమాలా పాణి ర్జటాధరో హంసవాహనో రూపాద్యక్షరబీజ స్సావిత్రీపతి రభిజిజ్ఞాతః కమండలుధ్వజో హుంకార రవ స్త్వష్టా....త్వష్టారం రూపజాతం నిధిజం ప్లోతాధిపతి మితి."

ఇంకు త్వష్టృదేవుని స్వరూపాది విశేషములను వర్ణించుచు ఆయన సావిత్రీపతి అని చెప్పబడినవి. త్వష్ట యనగా విశ్వకర్మ యని కూడ వేదహృదయము. భాష్యకారులు కూడ అట్లు భావించియున్నారు. అంతియే కాక పురుషసూక్తము "విశ్వకర్మణ స్సమవర్తతాధి, తస్య త్వష్టా విదధ ద్రూపమేతి." త్వష్ట విశ్వకర్మయే అనియు, లేదా విశ్వకర్మాన్వతారమే త్వష్ట యనియు చెప్పుచున్నది. ఇక సావిత్రి యనగా గాయత్రియే యని సుస్పష్టమేకదా! కనుక గాయత్రీ విశ్వకర్మలకు పత్నీపతిధర్మమును జగత్పితృత్వమును ఈ వైఖానసాగమము వాచ్యముగనే నిర్ణయించుచున్నది. ఉభయులును ప్రకృతిపురుషస్వరూపు లగుట, పంచాననములు, దశబాహువులు కలవారగుట మొదలగు విశేషములుకూడ వారి ఆదిమ దంపతిత్వమునకు సాక్ష్యములే. త్వష్టృదేవుడు హంసవాహను డనుటకూడ ఆయనసావిత్రీపతిత్వమునకు సూచకమే. బ్రహ్మయు విశ్వకర్మయు హంసవాహనులే. అంతేకాదు. బ్రహ్మ – విశ్వకర్మలు అభేదస్వరూపులేయని నా ఋగ్వేద దర్శనమున శ్రుతి ప్రమాణములతో నిరూపించుట యైనది. యజుర్వేదము వ్యంగ్యముగా గాయత్రీ విశ్వకర్మలయైక్యమును, దంపతిత్వమును నిరూపించినది. బృహదారణ్యకోపనిషత్తు గాయత్రిని వాగ్దేవి (సరస్వతి) గా నిర్ణయింపగా, విశ్వకర్మ సూక్తము విశ్వకర్మను వాచస్పతినిగా బేర్కొని వాగ్దేవీ విశ్వకర్మల తత్త్వమును ప్రవచించినది. ఈ వైఖానసాగమము

సావిత్రి, త్వష్ట (విశ్వకర్మ) కు పత్నియని వాచ్యమొనర్చి వారి ఆదిమ దంపతిత్వమును సుదృఢముచేసినది. ఈ విధముగా గాయత్రీ, సావిత్రీ, సరస్వతులు విశ్వకర్మతత్త్వమున అంతర్భూతలై జగన్మాతలు, వేదమాతలు అయినారు.

## పురాణ ప్రమాణము

"ఓంకారస్తు పరం బ్రహ్మ విశ్వకర్మా పరశ్శివః,
పరాత్పరతరోంకారః పరామూర్ధ్వం పరాత్పరః.
అగ్నిస్తు విశ్వకర్మైవ తదర్థం వహ్నిదైవతమ్,
తస్య బ్రహ్మ ఋషిశ్చైవ గాయత్రీ ఛంద ఉచ్యతే.
స్వరూపం పరమాత్మా చ ప్రణవస్యైవ తస్య హి,
లోకమాతా చ సావిత్రీ త్ర్యక్షరం బ్రహ్మసమ్మితమ్.
వేద శ్చ లోకమాతా స్యా ద్గాయత్రీ వేదమాతృకా,
జాతాఽసౌ దేవతానామ్నా విశ్వకర్మేతి కీర్తితా.

—ఇతిస్కాందపురాణే,నాగరఖండే, విశ్వకర్మోపాఖ్యానే, బ్రాహ్మణ్య గాయత్రీ నిర్ణయో నామ చతుర్దశోఽధ్యాయః,

"పరశివుడును, పరబ్రహ్మమును, విశ్వకర్మయు ఓంకారమే అగును. పరస్వరూపమున కంతటికిని ఊర్ధ్వముననున్నదదియే. అగ్నికూడ విశ్వకర్మయే. అందుకే అది వహ్నిదైవతము కలదయ్యెను. ఆప్రణవమునకు (ప్రణవరూపమునందిన గాయత్రికి) బ్రహ్మ ఋషియు, గాయత్రి ఛందస్సును, పర

మాత్మ స్వరూపమును, లోకమాతయగు సావిత్రి మూడక్షర ములు గలదియు, బ్రహ్మసమ్మితయునగును. వేదను లోక మాతయే. అట్టి వేదమునకు మాత గాయత్రి. ఆ గాయత్రీ దేవత విశ్వకర్మనామముతో కీర్తింపబడినది.''

ముందుదాహరించిన వేదాదుల యభిప్రాయమునే ఈ పురాణ వాక్యములు దృఢపఱచుచున్నవి. దీనిని బట్టి గాయత్రీ విశ్వకర్మలకు స్త్రీపుం భేదము తక్క పంచముఖ దశబాహ్వాది బాహ్య రూపసామ్యమును సచ్చిదానందస్వరూప, సృష్ట్యాది క్రియాకరణ- అంతరంగికరూప సామ్యమును కలిగి వారుభయు లద్వైతరూపులని స్పష్టమగుచున్నది.

## పంచవిధసామ్యములు

గాయత్రీ విశ్వకర్మలకు పంచవిధసామ్యములుకూడా నున్నవి—

1 నామసామ్యము : -విశ్వకర్మపదము గాయత్రీ విశ్వకర్మల కిరువురికిని చెల్లుచున్నది కాన వారికి నామసామ్య మున్నది.

2 రూపసామ్యము : పంచశీర్షములు, దశబాహువులు మొద లగు రూపసామ్యము లిరువురికిని సమానమే.

3. అవస్థానసామ్యము :అవస్థానమనగా సచ్చిదానందానంత త్వాదులు. ఉభయులును సచ్చిదానందస్వరూపులే. ఉభయుల మహిమయును అనంతమే.

4. అనుష్ఠానసామ్యము : అనుష్ఠానమనగా చేసెడి కర్మలని యర్థము. గాయత్రీవిశ్వకర్మ లిరువురును బ్రహ్మాండముల యొక్క సృష్టి, స్థితి, లయము, తిరోధానము, అనుగ్రహము – అనెడి పంచకర్మలను చేయుచునే యున్నారుగాన వారికి అనుష్ఠానసామ్యము భూయిష్టముగా కలదు.

5. అధిష్ఠానసామ్యము: అధిష్ఠానము అనగా ఆధారముగాయత్రీ విశ్వకర్మ లిరువురును జగత్తులు తోచుటకు అధిష్ఠాన (ఆధార) భూతులే కనుక, వారికి అధిష్ఠానసామ్యము నున్నది. అఖండ పరబ్రహ్మము నాధారము చేసికొనియే జగము తోచుచున్నది కావున, వా రుభయులును జగత్తులుత్క్రీడించుటకు ఆధార భూతులే యన్నమాట. ఈ పంచసామ్యములే కాక పురుష సూక్త బృహదారణ్యకములు చెప్పిన "చతుష్పాద్విభూతి" అనునది గాయత్రీవిశ్వకర్మల కధికముగా నున్నది. దీనిని అవ స్థానసామ్యములో నంతర్భావింపచేసినను చేయవచ్చును.

## గాయత్రీ మంత్రోపాస్యుడు విశ్వకర్మయే

గాయత్రీ మంత్రము ఋగ్వేదములో తృతీయమండలమున 62 వ సూక్తములో పదవ ఋక్కు, ఇది గాయత్రీ చ్ఛందములోనే యున్నది. దీనికి సాయణుల భాష్యము ననుసరించి యర్థ మిట్లున్నది.—

"యః సవితా దేవః = ఏ సవితృదేవుడు, అస్మాకం = మన యొక్క, ధియః = కర్మలను. లేదా ధర్మాదివిషయము లైన బుద్ధులను, ప్రచోదయాత్ = ప్రేరేపించుచున్నాడో, తత్ = ఆసవితృదేవునియొక్క - అనగా సర్వాంతర్యామిగా ప్రేరకుడైన ఆ జగత్స్రష్టయగు పరమేశ్వరుని యొక్క, వరేణ్యం = అందఱకు ఉపాస్యముగను, జ్ఞేయముగను భజింప దగిన, భర్గః = భర్గనామక తేజమును, (అవిద్యాతత్కార్య ముల నది పొందుటంబట్టి దానికి భర్గమని పేరుకలిగినది) అనగా పరబ్రహ్మాత్మకమును, స్వయంజ్యోతియునగు తేజమునని భావము. ధీమహి = ధ్యానించుచున్నాము" సవితృశబ్దము "షూ- ప్రేరణే' అను ధాతువునుండి పుట్టినది. "సువతి - సుప్తం ప్రేరయతీతి సవితా" నిద్రించువానిని మేల్కొలుపు వాడని సవితృశబ్దమునకు వ్యుత్పత్తి. సాయణులు సవితృశబ్దము నకు సూర్యుడనియు, భర్గశబ్దమునకు అన్నమనియుకూడ అర్థము చెప్పినారు. అవి కేవలము బాహ్యార్థ (అధిభౌతికార్థ) ములు మాత్రమే. అంతరార్థమును పర్యాలోచించినచో నిద్ర నుండి మేల్కొలుపుట, అనగా - అజ్ఞాననిద్రనుండి మేల్కొ ల్పుటయనియే భావము. అట్లు మేల్కొలుపువాడు బాహ్య సూర్యుడుకాక, అంతరంగస్థితుడును, పరమాత్మస్వరూపుడును నగు సవితయే. వేద మంత్రములకు అధిభౌతిక, అధి దైవిక, ఆధ్యాత్మికములైన మూడర్థములు నుండునని మంత్రవేత్తలకు చెప్పబనిలేదు. ఆ పక్షమున నిచ్చట అంతర మగు అధ్యాత్మి

కార్థమునే సంభావింపవలయును. బుద్ధులను ప్రేరేపించు దేవుడు సూర్యేంద్ర వరుణాదిరూపుడు కాడు. అతడు సర్వభూత హృద యాధివాసియైన పరమాత్మయే. ఈశ్వరుడే సర్వభూతముల హృదయములందును నివసించి తద్బుద్ధులను ప్రేరేపించుచు ఆడించుచున్నాడనుటకు గీతలలోని ఈ శ్లోకమే ప్రమాణము—

"ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా,"
అధ్యా. 18 శ్లోకం 61

ఈ ఈశ్వరుడు విశ్వకర్మపరమాత్మయే యని శ్వేతాశ్వ తరోపనిషత్తు పలుకుచున్నది—

"ఏష దేవో విశ్వకర్మా మహాత్మా
సదా జనానాం హృదయే సన్నివిష్టః,
హృదా మనీషా మనసా భిక్లృప్తో
య ఏత ద్విదు రమృతా స్తే భవన్తి." — 4.17

దీనికి కీ. శే. వడ్డెపాటి నిరంజనకవిశేఖరుల తెలుగు—
"ఇతడు విశ్వకర్మ ఈ దేవుడు మహాత్మ .
యెపుడు నిలుచు జనుల హృదయమందు:
ఎవ్వ కీ మనీష నెదలోన భావింతు
రమృత లగుదు రెల్ల రట్టివారు."

సూర్యుడు నిద్రాముద్రితజగమును మేల్కొల్పి కర్మ ప్రపంచమున ప్రవేశపెట్టును. తన్మండలాంతర్గతుడైన పర

మాత్మ (విశ్వకర్మ)యే జీవులహృదయస్థితుడై వారి బుద్ధులను వారి వారి కర్మానుగుణముగా ప్రేరణ నిచ్చుచుండును. కనుక బాహ్యార్థమున గాయత్రీ మంత్రార్థభూతునిగా సూర్యుని తీసికొన్నను, అంతరార్థమున అంతఃకరణ వృత్తులను ప్రేరేపించు విశ్వకర్మపరమాత్మనే గ్రహించుట సమంజసము. కనుకనే సాయణులు తన భాష్యములో - సవితను సర్వాంతర్యామి, జగత్స్రష్ట,పరబ్రహ్మము - ఇత్యాది పదములచే పేర్కొన్నారు. ఇంతియే కదు. ఋగ్వేద దశమండలములో 81, 82 సంఖ్యలు గలవి. విశ్వకర్మసూక్తములు. అట్లే యజుర్వేద తైత్తిరీయసంహిత చతుర్థకాండ షష్ఠప్రపాఠక ద్వితీయాను వాకమునందును, శుక్లయజుర్వేదమునను విశ్వకర్మసూక్తము లించు కించుకభేదముతో ఉన్నవి. వీనికి భాష్యమును వ్రాయుచు సాయణులు విశ్వకర్మ సకలబ్రహ్మాండసృష్టికర్తయగు పరమాత్మయే యని ఉపనిషత్ప్రమాణములను చూపుచు వివరించినారు.

"అంతియేకాదు. త ఆయజన్త ద్రవిణం సమస్మై ఋషయః పూర్వే జరితారో న భూనా" అనుమంత్రభాష్యములో"... తే పూర్వఋషయో ద్రష్టారో రశ్మయోఽస్మై ఆదిత్యాత్మకాయ విశ్వకర్మణే ద్రవిణం తేజ ఆయజన్త" విశ్వకర్మ ఆదిత్యాత్మకుడే అనినారు కదా! (ఋ.మం 10.81.)

కావున గాయత్రీ మంత్రమునందు 'సవిత, అనుపేరితో చెప్పబడిన దేవాదిదేవుడు ఈ విశ్వకర్మయేయని సాధకులు గ్రహించి ఆ తండ్రి నుపాసింపవలసియున్నది.

ఇంత వఱకు వ్రాసిన గ్రంథమునుబట్టి గాయత్రికి ఆ దేవదేవునితో బహువిధ సాదృశ్యము లుండుటవలన తన్మంత్రార్థలక్ష్యభూతుడు విశ్వకర్మయే యనుటలో సందేహములకు తావేలేదు. వ్రాయబోవు గ్రంథమునుబట్టియు ఈయంశ మింకను సుస్పష్టము కాగలదు. శ్రీ బి. (బండిగనవిలె) నారాయణ అయ్యంగారు అను మహావిద్వాంసుడు ఈ శతాబ్ది ప్రారంభమున "ఇండో ఆర్యన్ మైథాలజి" (INDO ARYAN MYTHOLOGY) అను గ్రంథమును ఆంగ్లమున వ్రాసి యున్నాడు.

ఆయన గ్రంథారంభమున గాయత్రీమంత్రార్థమును వివరించుచు – సవితృశబ్దమునకు జనకుడని అర్థమనియు, ఋగ్వేదకాలమున ఈ అర్థము ప్రచురముగా నున్నదనియు, గాయత్రీమంత్రములోని "సవితృ" శబ్దమునకు – అండ, పిండ, బ్రహ్మాండములను సృజించిన జగజ్జనకుడని అర్థమనియు, అట్టి జగముల తండ్రి విశ్వకర్మయే అనియు. ఋగ్వేదీయవిశ్వకర్మ సూక్తములోని "యో నః పితా జనితా యో" విధాతా' "చక్షుషః పితా మనసా హి ధీరో" అనెడి వాక్యములను చూపి చక్కని సమన్వయము చేసినాడు. ఆయన వివరణము చదివిన పిమ్మట చేసిన నాపరిశోధనము లో క్రింది సత్యములు బయటపడినవి.

"షు" అనెడి సంస్కృతధాతువునకు ప్రేరణ యొక్కటే అర్థముకాదు. "షు ప్రసవైశ్వర్యయోః" అని కూడ అర్థము లున్నవి. ప్రసవించుట అనగా కనుట అని అందఱెఱింగినదే.

దీనినిబట్టి సవిత అనగా జగములను కనువాడన్న అర్థము సిద్ధమగుచున్నది. ప్రేరణచేయువాడను నర్థమే కాక, "అండ పిండ బ్రహ్మాండములను కన్నతండ్రి" అని కూడ సవితృ శబ్దమునకు అర్థము లభించుచున్నది. అప్పుడు "లోకములను గన్న-యే తండ్రి మా బుద్ధునను ప్రేరేపించుచున్నాడో అట్టివాని భర్గనామక తేజమును ధ్యానించుచున్నాము". అని గాయత్రీ మంత్రార్థము. సవిత అనగా జనకుడు. ఉత్పాదకుడు అని శ్రీనారాయణ అయ్యంగారు చెప్పిన అర్థమును దిగువ ఉదాహరించిన నిరుక్త వాక్యములు బలపఱచుచున్నవి. ఆయన నిరుక్తాదులను చూచియే జనకుడను నర్థమును నిర్ధారణ చేసి యుండును.

## నిరుక్త ప్రమాణము

"సవీమని" పదమున కర్థము తెల్పుచు సవితృశబ్దమును గూర్చి యాస్కాచార్యనిరుక్త మిట్లను చున్నది.—

1. "సవీమని ప్రసవే" "దేవస్య వయం సవితుః సవీమని "ఇత్యపినిగమో భవతి." —నిరుక్తం. 6 వ, అధ్యాయం.

వ్యాఖ్య :—సవీమని అనవగత మేతత్. ప్రసవే ఇత్యవగమః. "దేవస్య వయం సవితుః" సవీమని ఇత్యపి నిగమః సర్వార్థ ప్రసవితుః దేవస్య సవీమని ప్రసవే సర్వార్థాభ్యనుజ్ఞానే వయం సదా స్యామేతి యోజనా.

దీనికంతటికిని అర్థము "మనము సర్వమునకును ఉత్పాదకు (జనకు) డగు దేవునియొక్క ఆజ్ఞలో ఉందుము గాక" అని. దీనినిబట్టి సవిత యనగా పుట్టించినవాడు – తండ్రియని స్పష్టమగుచున్నదిగదా !

2. "హోతృజత స్త్వ్యగ్ని ర్వైశ్వానరీయో భవతి, "దేవ సవిత రేతం త్వా వృణతేఽగ్నిం హోత్రాయ సహ పిత్రా వైశ్వానరేణ" ఇతి. ఇమ మే వాగ్నిం సవితార మాహ, సర్వస్య ప్రసవితారమ్ ...." నిరుక్తం 7 వ అధ్యాయం. వ్యాఖ్య —"సవితః దేవ= హే సకల జగదుత్పాదక దేవ!"

దీనిని బట్టి కూడ సవిత అనగా సకల జగదుత్పాదక దేవుడని స్పష్టమగుచున్నదికదా ! సాయణులు "షూ ప్రేరణే" షూ ధాతువునకు ప్రేరణార్థమును సామాన్యముగా వ్రాసినారు. అందుకు కారణము గాయత్రీ మంత్రములో "ప్రచోదయాత్" ప్రేరేపించుగాక – అని యుండుట కారణము కావచ్చును. వేద మంత్రార్థ నిర్ణయములో అతిపూర్వుడగు యాస్కాచార్యుడు పరమప్రామాణికుడని మఱువరాదు. యాస్కాచార్యుని దే మఱొక ప్రబల తమ ప్రమాణమును చూడుడు —

"దేవ స్త్వష్టా సవితా విశ్వరూపః
పుపోష ప్రజాః పురుధా జజాన
ఇమా చ విశ్వా భువనా న్యస్య
మహ ద్దేవానా మసురత్వ, మేకమ్." ఋ. 3–55–16

వ్యాఖ్య :— సవితా = సర్వేషా ముత్పాదయితా
నిరుక్తం 10 వ, అధ్యాయం.

త్వష్ట్ర సూక్తములోని దీ మంత్రము. దీనిభావమిది - సర్వోత్పాదకుడును, విశ్వరూపములు కలవాడును, దేవుడును నగు త్వష్ట (విశ్వకర్మ) బహువిధప్రాణులును సృష్టించి వారలను పోషించినాడు. ఈ సమస్తభువనములును ఆ దేవ దేవునివే.'' ఇట్లనుటచేత సవిత సాక్షాద్విశ్వకర్మయే యని తేలుచున్నది. ఈ మంత్రములో త్వష్ట, సవిత అనెడి రెండు పదములు ప్రయోగింపబడుట విశేషము. త్వష్ట, లేదా విశ్వకర్మ ద్యావాపృథువులను సృష్టించిన దేవుడని దిగువ మంత్రము కూడ స్పష్టముచేయుచున్నది—

''య ఇమే ద్యావా పృథివీ జనిత్రీ
రూపై రపింశ ద్భువనాని విశ్వా
త మద్య హోత రిషితో యజీయాన్
దేవం త్వష్టార మిహ యక్షి విద్వాన్.''
ఋక్కు 10-110-9

' ఓ యజమానుడా ! ఏత్వష్ట్ర దేవుడు ద్యావాపృథువులను, సమస్తభువనములను దేవతిర్యఙ్మరాది నానావిధ రూపములతో నిండినవానినిగా సృష్టించినాడో, అట్టి త్వష్ట్ర దేవుని-స్తుతులచేతను, హవిస్సులచేతనుపూజింపుము. ఇట్లనుట చేత సవితయు, విశ్వకర్మయు జగజ్జనకత్వధర్మములు కలవారని తేలుచున్నది. కనుక గాయత్రీమంత్రములో జగజ్జనకుడుగా

పేర్కొనబడిన సవిత, విశ్వకర్మ సూక్తములో జగత్పితగాను జనితగాను పేర్కొనబడిన విశ్వకర్మయే యని నిర్బాధముగా సిద్ధాంతమగుచున్నది. అసలు మనము వైదికవాఙ్మయ పరిశోధనము చేయునప్పుడు లౌకిక వాఙ్మయపరిధులను దాటి, వైదిక వాఙ్మయమునకు సంబంధించిన నిఘంట్వాదుల ననుసరింపవలసి యున్నదని మఱువరాదు.

శంకరులు సౌందర్యలహరిలో లలితాదేవిని "పరబ్రహ్మ మహిషి." అని సంబోధించినారు. ఆయన దృష్టిలో శివుడు పరబ్రహ్మముకూడ అన్నమాట. కాళిదాసు సైతము —

"వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌ వన్దే పార్వతీ పరమేశ్వరౌ."

— రఘువంశము. 1-వ సర్గ

అని పార్వతీపరమేశ్వరులకు జగత్పితలనిస్తుతించినాడు, సంస్కృత వాఙ్మయమున - శివునికి, విశ్వకర్మకు, బ్రహ్మకు అభేదమును పాటించిన ఘట్టములు పెక్కులున్నవి. శివునకు శంభుడని పేరు కలదు. కాని. విశ్వకర్మకు "విశ్వశంభువనినామ మున్నది.విశ్వశంభూరవసే సాధుకర్మా" అనిఋగ్వేదము "విశ్వ శంభూ ర్విశ్వస్య సుఖస్యోత్పాదకః" అని భాష్యము. అనగా

సమస్తానందమును కలిగించువాడని భావము. ఈ మాట శివునకంటెను, విశ్వకర్మకుగల ఆధిక్యమును తెలియ జేయుచున్నది. శివవిష్ణ్వాదులే దేవదేవువంశము లనుట సంస్కృత వాఙ్మయమున కాంచవచ్చును. (మా విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగమము) కొందఱు శైవులు విశ్వకర్మను పరశివ విశ్వకర్మయని ఆరాధింతురు. "పరశివవిశ్వకర్మాగమము" అని ఒక ఆగమ గ్రంథముకూడ కలదని నాశిల్పదర్శనములో వ్రాసినాను. మైసూరు మహారాజస్థాన శిల్పాచార్యులు కీ. శే. సిద్ధలింగేశ్వరస్వామివారు పరశివ విశ్వకర్మోపాసకులే. ఆయన అనేక పరశివవిశ్వకర్మ మూర్తులనుకూడ శిల్పించి ప్రతిష్ఠించినారు. అట్టివి మైసూరులోనే ఒకటి కలదు. బ్రహ్మ, విశ్వకర్మ, శివుడు – ఈ ముగ్గురును పంచశిరస్కులుగా వాఙ్మయమున వర్ణింపబడుటయు, వారు సృష్ట్యాదిసర్వకార్యకర్తలుగా చెప్పబడుటయు ఈ ఐక్యమునకు కారణముకావచ్చును. అయినను గాయత్రికిని విశ్వకర్మకును నామ్యమున్నట్లు, గాయత్రీ శివులకుగాని, గాయత్రీ బ్రహ్మలకుగాని లేకుండుట గమనింపదగినది.

ఈ గాయత్రీవిశ్వకర్మల పరమాధ్యాత్మిక తత్త్వమును గూర్చి కీ. శే. కోలవెన్ను పరబ్రహ్మతీర్థులవారు తమ "జగచ్ఛిల్పము" అను గ్రంథమున విస్తరముగా వివరించినారు. పాఠకులు దానినికూడ చదువుట మంచిది.

# గాయత్రీ ఉపాసన

"గాయన్తం త్రాయతే ఇతిగాయత్రీ "అనెడి వ్యుత్పత్తిని బట్టి చూచిన, తన్ను ధ్యానించువారిని రక్షించునది యని అర్థమగుచున్నందునను, గాయత్రీదేవి ప్రకృతికి ప్రతీక అని అనుకొన్నాము కావునను గాయత్రీధ్యాన మనగా ప్రకృతి యొక్క ఉపాసన మనియు తెలుచున్నది. ఇక్కడ ధ్యానో పాసన శబ్దములచేత పరిశీలన పరిశోధనలని అర్థము చేసి కొనవలయును. అనగా చరాచరాత్మకమగు ప్రకృతిని గాయత్రీ మాతగా భావించి అందలి అణు మహదాది వస్తుజాలము లను పరిశీలించియు. పరిశోధించియు, వాటిని తన కుపయోగించు నట్లు మలచుకొనుట, ఉపయోగించుకొనుట కూడ గాయత్రీ సముపాసనమే అగుచున్నదన్నమాట. పిండ బ్రహ్మాండరూప ప్రకృతిని పరిశోధించి యుపాసించువాడు తద్రహస్యములను తెలిసికొని వాటి నాత్మాభివృద్ధికిని, విశ్వకల్యాణమునకును ఉపయోగించుకొన జాలుచున్నాడని సారాంశము. ఆ గాయత్రి (ప్రకృతి)యు తన్నుపాసించువారికి నిజరహస్యములను వెల్లడించి ప్రకృతి సేవాద్వారమున వానిని పరమాత్మాభిముఖుని చేయు చున్నది. ఇట్టి విశేషార్థమును కూడ భావించుటలో ఎంతయో ప్రయోజన మున్నదని సాధకు లెఱుంగుదురు గాక !

గాయత్రిని మాతృదేవతగా నుపాసించుచు తద్ద్వారా తన్మంత్రార్థమయిన విశ్వకర్మపరబ్రహ్మమును పొంది మానవు లమృతులగుట గాయత్రీ విశ్వకర్మోపాసనల లక్ష్యమని తెలియు

వలయును. లోకమునగూడ మానవులు తల్లినుండి ప్రభవించి ఆమె మూలమున తండ్రి యంకము నధిరోహించి కృతార్థులగుట కానవగుచున్నది కదా! గాయత్రీ మంత్రోపాసన మహిమను ద్విజులగువా రెఱింగియే యున్నారు. విశ్వకర్మో పాసనా ఫలితములు విశ్వకర్మోపనిషత్తునం దిట్లు స్తుతింపబడినవి. తదుపాసకుల కివి సుపరిచితములు —

"....ఓమ్ అథ నిత్యోదేవ ఏకో విశ్వకర్మా. యో దేవానాం నామధా ఏక ఏవ విశ్వకర్మా. విరాడ్విశ్వకర్మా స్వబ్రహ్మా ద్విశ్వకర్మా. అథ రుద్రో విశ్వకర్మా. బ్రహ్మా విశ్వకర్మా. శివశ్చ విశ్వకర్మా. విష్ణుశ్చ విశ్వకర్మా ... విశ్వకర్మణ ఏవేదగ్ం సర్వం, యద్భూతం యచ్చ భవ్యం. నిష్కలంకో నిరంజనో నిర్వికల్పో నిరాఖ్యాత శ్శుద్ధాఽద్వంద్వైకో విశ్వకర్మా న ద్వితీయోఽస్తి కశ్చిత్. య ఏవం వేద. స విశ్వకర్మా భవతి, స విశ్వకర్మా భవతి. ఓ మిత్యగ్రే వ్యాహరేత్. నమ ఇతి పశ్చాత్ విశ్వకర్మణ ఇత్యుపరిష్టాత్. ఓ మిత్యేకాక్షరమ్. నమ ఇతి ద్వే అక్షరే. విశ్వకర్మణ ఇతి పంచాక్షరాణి. ఓం విశ్వకర్మణ ఇతి షడక్షరాణి. ఓం నమో విశ్వకర్మణ ఇత్యష్టాక్షరం పదమ్. యో హ వై విశ్వకర్మణ ఇత్యష్టాక్షరం పద మధ్యేతి. అనుపబ్రువణ త్సర్వమాయు రేతి. విందతే. ప్రాజాపత్యం. రాయస్పోషం గౌపత్యం. తతోఽమృతత్వ మశ్నుతే, తతోఽమృతత్వమశ్నుతఇతి. య ఏవం వేద. ప్రత్యగానన్దం బ్రహ్మపురుషం ప్రణవస్వరూపం. అకారఉకారో మకార ఇతి. తా నేకధా సమభరత్తదేత దోమితి. యముక్త్వా

ముచ్యతే, యోగీ జన్మసంసారబంధనాత్. ఓం నమో విశ్వ కర్మణ ఇతి మంత్రోపాసకః, సాయుజ్యం గమిష్యతి.—"

ఈ ఉపనిషద్వాక్యములలో విశ్వకర్మతత్త్వము ఉగ్గడింపబడి "ఓం నమో విశ్వకర్మణే" అను అష్టాక్షరియు, దాని నుపాసించుటవలనగల్గు అమృతత్వాదిరూప ఫలములును ఉపదేశింపబడినవి. గాయత్రీ మంత్రార్థము పూర్వము వ్రాయబడినది. ప్రతిసాధకుడును ప్రతి దినమును నియతుడై గాయత్రీ మంత్రమును, విశ్వకర్మాష్టాక్షరిని అష్టోత్తరశతము జపించుచో ఐహిక పారమార్థికములగు సమస్తఫలములను పొందగలడు!

ఈ సందర్భమున "గాయత్రీమంత్ర లక్ష్యభూతుడు విశ్వకర్మయేకదా, కనుక గాయత్రీమంత్ర జపమును, అర్థ భావనను చేసినచో విశ్వకర్మ తత్త్వమే గోచరించును. పిమ్మట విశ్వకర్మమంత్రోపాసన చేయనేల?" అని యొక ప్రశ్న రావచ్చును. దీనికి సమాధాన మిది :—

సృష్ట్యాదిమకాలమున సదసదతీతమగు అఖండవస్తు వొక్కటే కలదనియు, అదియే విశ్వకర్మయనియు, దాని నుండియే సృష్టీచ్ఛవలన గాయత్రీనామముతో మాయాశక్తి ప్రాదుర్భావము జరిగినదనియు, ఆదిమతత్త్వమగు విశ్వకర్మ లేకున్నచో శక్తికి ప్రత్యేకసత్త లేదనియు, ఆ శక్తి ఆ దేవ దేవుని ప్రతిరూపము - లేక ప్రతిబింబమే అనియు, వారే ప్రకృతిపురుషు లనియు వ్యాసారంభముననే చెప్పికొన్నాము.

చతుర్వింశతి తత్త్వములతో నేర్పడిన ఈ శరీరమును ధరించియే
తదంతర్యామియైన పరమేశ్వరునిజీవులుపొందవలసియున్నారు.
కావునఅందుకుఇరువదినాలుగక్షరములుకల గాయత్రీ(మాతృ)
మంత్రమును జపించుచు తదర్థరూపుడైన విశ్వకర్మపరబ్రహ్మ
మును పొందవలయునని ఇక్కడ నెఱుంగదగిన రహస్యము.
మానవుడెప్పుడును ప్రకృతి ద్వారముననే పురుషుని (పర
మాత్మను)పొందవలసియున్నాడు. కావునమాతృ రూపిణియు,
విశ్వకర్మతో అభేదమును పొందినదియునగుగాయత్రినుపాసించిన
పిమ్మటనే కేవలమైన విశ్వకర్మతత్త్వము నారాధించుట
కర్తవ్యమని యిక్కడ తెలియదగిన పరమార్థము. గాయత్రీ
మంత్రమునకు లక్ష్యార్థ భూతుడువిశ్వకర్మయైనను మంత్రాక్షర
స్వరూపిణిగాయత్రియే. ఈ ఉభయుల తత్త్వము వాగర్థముల
వంటిది. గాయత్రి వాగ్రూపిణి యని పూర్వగ్రంథమున
గ్రహించియే యున్నాము. తదర్థ స్వరూపుడు విశ్వకర్మ
యనియు అనేకోదాహరణముల మూలమున స్పష్టమయినది.
ఇక విశ్వకర్మ మంత్రములో నిష్కలంక నిర్గుణనిరంజనుడగు
పరాత్పర విశ్వకర్మయే ఉపాసింపదగినవాడు; ఇందు ప్రకృత్య
తీతమగు కేవల పరమాత్మయే-సదసదతీతమగు ఆదిమతత్త్వమే
సన్నిహితమై యుండును. ఆ తత్త్వమాగాయత్రికి (ప్రకృతికి)
అతీతమని వేఱుగా చెప్పనక్కఱలేదు. గాయత్రీ ఉపాసన
వఱకును ద్వంద్వస్థితి తప్పనిది. విశ్వకర్మోపాసనకు వచ్చునప్ప
టికిద్వంద్వోపశాంతి జరిగి కేవల నిరంజనైక స్థితికలుగును.

సృష్టికార్యము ఏ యేకమునుండి సద్వితీయమై నానాత్వముతో వెలసినదో అట్టినానాత్వమునుండి మఱల ద్వంద్వములను దాటుకొనుచు సద్వితీయముద్వారా ఆదిమ ఏకైకతత్త్వములోనికి నడచి అంద్వైక్యము కావలసినదే. మొదటినుండిచివరకువచ్చినట్లు, మఱల చివరినుండి మొదటికి చేరిననే గాని జీవిత ప్రయాణమునకు సమాప్తి లేదు.

ఓం తత్ సత్

## వ్యాసరచనకు ప్రమాణ గ్రంథములు:

1. ఋగ్వేదము. 2. యజుర్వేదము. 3. పురుష సూక్తము. 4. బృహదారణ్యకోపనిషత్తు. 5. ఛాందోగ్యోపనిషత్తు. 6. శ్వేతాశ్వతరోపనిషత్తు 7. భగవద్గీత. 8. వైఖానసాగమము. 9. బ్రహ్మసూత్రశ్రీభాష్యము. 10. బ్రహ్మసూత్రశాంకరభాష్యము. 11. స్కాందపురాణ నాగరఖండము. 12. యోగదర్శనము (మదీయము) 13. మిత్రసాహస్రి (మదీయము) 14. Indo Aryan Mythology.

# సవరణలు

| పుట | పం_క్తి | ఉన్నది. | ఉండవలసినది. |
|---|---|---|---|
| 2 | 16 | లేకుండును. | లేకుండుటను |
| 3 | 2 | వికారంశ్చ | వికారాంశ్చ |
| 3 | 18 | ద్యుష్ట | ద్యష్ట |
| 4 | 12 | (అటంక) | (అంటక) |
| 5 | 9 | అయిన | లయిన |
| 5 | 9 | పురుష | పురుషు |
| 5 | 10 | జగత్తులోని | లు జగత్తులోని |
| 8 | 14 | ఉభయులును | ఉభయులను |
| 13 | 19 | శాశ్యతము | శాశ్వతము |
| 15 | 11 | కొనునది | కొనినది |
| 16 | 18 | రభిజిజ్ఞాతః | రభిజిజ్జాతః |
| 19 | 16 | కారికి | వారికి |
| 22 | 19 | రమృత | రమృతు |
| 26 | 5 | హోతృజత | హోతృజప |
| 27 | 19 | తృష్టం | త్వష్టం |

0883 - 246 2565
903 246 2565

MOHAN PUBLICATIONS

మోహన్ పబ్లికేషన్స్,

అజంతా హోటల్ ఎదుట, కోటగుమ్మం, రాజమహేంద్రవరం - 533101.

WWW.MOHANPUBLICATIONS.COM

# మావద్ద లభించు గ్రంథములు

## 1. వ్రతకథలు - పూజలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ.10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. | వరలక్ష్మీ వ్రతం | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | 10-00 |
| 7. | త్రినాధ వ్రతం(కలర్) | 10-00 |
| 8. | త్రినాధవ్రతం(సాదా) | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. | వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 30-00 |
| 18. | శివదీక్ష | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

